శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళం
మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం ॥
ప్రభో సమంతాత్పరివర్తితైశ్రీ
కర్పూర నీరాజన దీప మాల్యైః
యుష్మన్ మహార్చిః పరివేష పంక్తిః
కిమ్మీరితాభాస్స్వ నఘేనఘ ప్రభో ॥

శ్రీ అనఘాదేవి సమేత శ్రీ అనఘ స్వామినే నమః ఆనంద కర్పూర నీరాజనం దర్శయామి, నీరాజనాంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.

**మంత్రపుష్పం : ధాతాపురస్తాదితి మన్త్రపుష్పం**

ధాతాపురస్తా ద్యముదాజ హార । శక్రఃప్రవిద్వాన్ప్రదిశశ్చతస్రః ।
తమేవం విద్వానమృత ఇహ భవతి । న్యానఃపన్థా అయనాయ విద్యతే॥

రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే నమోవయంవై శ్రవణాయ కుర్మహే సమేకామాన్ కామ కామాయ మహ్యమ్ కామేశ్వరోవై శ్రవణో దదాతు, కుబేరాయవై శ్రవణాయ మహారాజాయ నమః, ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మ, ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోర్నమః, అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు, త్వం యజ్ఞస్త్వమ్, వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః త్వం తదాపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్, అధైతం విష్ణవే చరుం నిర్వపతిః యజ్ఞోవై విష్ణుః యజ్ఞ ఏవాన్ తతః ప్రతితిష్ఠతి, శ్రోత్ర జుహోతి విష్ణవేస్వాహా యజ్ఞాయైస్వాహా, ప్రతిష్ఠాయై స్వాహేతి.

దిగంబరాయ విద్మహే అత్రిపుత్రాయధీమహీ తన్నో దత్తః ప్రచోదయాత్॥
మహాదేవ్యైచ విద్మహే విష్ణు పత్నీచ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్.

శ్రీ అనఘాదేవి సమేత శ్రీ అనఘస్వామినే నమః దివ్య సువర్ణ మంత్రపుష్పాన్ సమర్పయామి. అనుచు చేతిలోనికి పుష్పములను తీసుకుని స్వామివద్ద ఉంచవలెను.

**ప్రదక్షిణం :** శ్లో॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతాని చ, తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః, త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల, అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ, తస్మా త్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్ధన ప్రదక్షిణం కరిష్యామి సర్వభ్రమనివారణం సంసారసాగరాన్మాం త్వంముద్ధరస్వ మహాప్రభో అనఘాసమేత అనఘస్వామినే నమః, ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. ఛత్రం ధారయామి, చామరం వీజయామి, నాట్యం నర్తయామి, గీతం శ్రావ యామి, నృత్యం దర్శయామి సమస్త రాజోపచారాన్ సమర్పయామి.

అనుచు ఆ పుష్పములను స్వామి వారికి సమర్పించవలెను. తదుపరి స్వామివారి కలశం దగ్గర ముందుగా వుంచినటువంటి తోరమును దక్షిణ హస్తమున మగవారు కట్టుకొనవలయును, వామ హస్తమున ఆడువారు ధరించ వలెను.

బ్రహ్మ విష్ణు మహేశాన రూపిన్ త్రిగుణనాయక
త్రైవర్ణిక నమస్తుభ్యం తోర దేవానఘాత్మక ॥

అనేన అనఘా సమేత అనఘస్వామి పూజనేన భగవాన్ శ్రీ అనఘాదేవి సమేత అనఘాస్వామి సుప్రీతో, సుప్రసన్నా, వరదో భవతు ఏతత్సర్వం శ్రీ అనఘ స్వామి చరణారవిందార్పణమస్తు అని ఈ మంత్రము చెప్పుకొనుచు తోరమును నీటితో కొద్దిగా తడిపి స్వామి వారికి సమర్పించవలెను.

కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్వభావాత్ ।
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥
హరిః ఓం తత్సత్.

తదుపరి దంపతులు ఇరువురు శ్రీ దత్తాత్రేయ ఉత్తర మాలా మంత్రమును జపించవలయును.

శ్రీ దత్తాత్రేయ మాలా మహామంత్రము.

అస్యశ్రీ దత్తాత్రేయ మాలా మంత్రస్యః సదాశివ ఋషి, అనుష్టుప్ చందః శ్రీ దత్తాత్రేయో దేవతాః ద్రాం బీజం, నమ ఇతి శక్తిః, దత్తాత్రేయా యేతి కీలకం మమ అజ్ఞాన నివృత్తి ద్వారా జ్ఞాన వైరాగ్య చతుర్విధ ఫల పురుషార్ధ సహిత అభీష్ట కామ సిధ్యర్ధే జపే వినియోగః

**పార్వత్యువాచ :-** మాలామంత్రం మమ బ్రూహి ప్రియా యస్మాదహంతవ

**శ్రీ ఈశ్వర ఉవాచ :-** శృణుదేవి ప్రవక్ష్యామి మాలామంత్ర మనుత్తమమ్.

ఓం నమో భగవతే దత్తాత్రేయాయ-స్మరణ మాత్ర సంతుష్టాయ-మహాభయ నివారణాయ-మహాజ్ఞాన ప్రదాయ- చిదానందాత్మనే - బాలోన్మత్త-పిశాచవేషాయ -మహాయోగినే-అవధూతాయ-అనసూయా నందవర్ధనాయ- అత్రిపుత్రాయ- సర్వకామఫలప్రదాయ-ఓం భవబంధ విమోచనాయ- ఆం అసాధ్య బంధనాయ -హ్రీం సర్వభూతిదాయ - క్రోం అసాధ్యాకర్షణాయ -ఐం వాక్ప్రదాయ-క్లీం జగత్త్రయ వశీకరణాయ - సౌః సర్వ మనః క్షోభణాయ- శ్రీం మహాసంపత్ప్రదాయ - గ్లౌం భూమండలాధిపత్యప్రదాయ - ద్రాం చిరంజీవినే -వషట్ వశీకురు వశీకురు - వౌషడాకర్షయాకర్షయ - హుం విద్వేషయ విద్వేషయ - ఫట్ ఉచ్చాట యోచ్చాటయ - ఠః ఠః స్తంభయ స్తంభయ-ఖేం ఖేం మారయ మారయ - నమస్సంపన్నాయ సంపన్నాయ - స్వాహా పోషయ పోషయ - పరమంత్ర పరయంత్ర పరతంత్రాణి ఛింది ఛింది - గ్రహన్నివారయ నివారయ వ్యాధీన్ వినాశయ వినాశయ - దుఃఖం హరహర - దారిద్ర్యం విద్రావయ విద్రావయ - దేహం పోషయ పోషయ - చిత్తం తోషయ తోషయ - సర్వమంత్ర స్వరూపాయ - సర్వయంత్ర స్వరూపాయ - సర్వ తంత్ర స్వరూపాయ - సర్వ పల్లవ స్వరూపాయ - ఓం నమో మహా సిద్ధిదాయ స్వాహా, ఓం నమో భగవతే దత్తాత్రేయాయ నమః

ఓం

శ్రీ దత్తాత్రేయాయ నమః





19-7-2015 ఆదివారం రోజున శ్రీ అనఘాష్టమి వ్రత పుస్తకావిష్కరణ
సందర్భంలో శ్రీదత్తాత్రేయ స్వామివారు కాంతి రూపంలో
దివ్యదర్శనం ఇచ్చిన ఫోటోలు ఇవి.

# శ్రీ అనఘాష్టమి వ్రత కథలు ప్రారంభం



శ్రీపాద రాజం శరణం ప్రపద్యే

శ్రీపాదుల వారు అంతర్ధానం చెందిన తరువాత శంకరభట్టుకు ఎన్నో దివ్యానుభవములు జరిగినవి. శ్రీపాదుల వారి నామము ఉచ్చరించినంతనే శ్రీపాద వల్లభుల వారి దివ్య చైతన్యము తనలో ప్రవేశించిన దివ్యానుభూతిని శంకరభట్టు పొందెను. కురుంగడ్డకు ఈవలి ఒడ్డున ఉన్న పంచదేవ్ పహాడ్‌లో నున్న పురాతనమైన విఠలుని మందిరమునందు శంకరభట్టు ధ్యానము చేయుచూ గడిపేవారు. ఒకనాటి మార్గశిర పౌర్ణమి రాత్రి శంకరభట్టు ధ్యానములో ఉండగా నడిఝామున నలువైపుల నుండి వేదఘోష చేయుచూ అనేకమంది సిద్ధపురుషులు, కృష్ణ విఠలుని మందిరమునకు ముందున్న పుణ్య వృక్షము చుట్టూ ఆసీనులైరి. ఈ సన్నివేశము రహస్య చైతన్య భూమికలోనికి ప్రవేశము నొందిన వారికి మాత్రమే గోచరమగును. ఆ ప్రాంతమంతయు సుగంధ పరిమళములతో నిండి దివ్యానుభూతిని కలిగించెను. ఆ వృక్షము యొక్క మూల భాగమున శ్రీపాదుల వారు ఆసీనులైరి. వామభాగమునందు అతిలోక సౌందర్య రాశియైన స్త్రీ కూర్చొనియున్నది. మూర్తీభవించిన మాతృవాత్సల్యము నిండిన ఆ స్త్రీ కనులు తరతరాల సమస్త మాతృదేవతల మమతా వాత్సల్యములు వర్షించుచున్నవా అన్నట్లున్నవి. చుట్టు ప్రక్కల ఉన్న వృక్షములు జంతువులు సైతము మానవ రూపము ధరించి వేధఘోషతో గొంతు కలిపినవి. కావున తీర్థములో ఉన్న చెట్టు, పుట్ట మొదలైనవన్ని తపోసమాధి స్థితియందు ఉన్న దివ్య పురుషులని తెలియవలెను. శ్రీపాదులు తమతో ఋణాను బంధమున్న ప్రతి ఒక్కరిని ఈ యోగ భూమికి ఆకర్షించెదరు. వారి సాధక బాధకములన్నీ తీర్చివేయుదురు. పంచదేవ్ పహాడ్‌నందు చేయు పూజ, యజ్ఞయాగములు, జపధ్యాన సాధన ములు, వ్రత దాన ధర్మములు మిక్కిలి ఫలవంతములగును. ముఖ్యముగా తత్వార్థము నెరిగి శ్రీ అనఘాష్టమి వ్రతము జరుపు వారి సర్వమనోభీష్టములు నెరవేరును. శ్రీ వాసవీ కన్యక ఆ బాధ్యతను తీసుకొను నటుల శ్రీపాదులవారు ఆశీర్వదించిరి.

శంకరభట్టు సందేహముల నివృత్తి చేయుచూ శ్రీపాదుల వారు ఇట్లు తెలిపిరి. ''అనంత కాల ప్రవాహములో సృష్టిలో నున్న ప్రతీ అణువూ తనను తాను తెలియు వరకూ, అమరత్వము నొందువరకూ గమనమాగదు. తొలి జీవకణంలో నున్న దివ్యత్వం అమృతత్వం వైపు అధిరోహించును. అదే పరిణామ రహస్యం. జీవులన్నీ అహాన్ని త్యజించి దైవప్రాప్తి నొందవలెను. సత్య జీవన విధానాన్ని పొందేందుకు దత్త భక్తులు విధిగా ఈ వ్రతమాచరించుట వలన పాపములు తొలగి, జ్ఞానము కలిగి, సర్వశుభములను పొంద వీలగును. మార్గశిర బహుళాష్టమి నాడు శ్రీ అనఘాష్టమి వ్రతమును ఆచరించవలెనని శ్రీపాదులవారే సెలవిచ్చిరి.

భక్తి శ్రద్ధలతో అనఘాష్టమి వ్రతము చేయుటకు నిశ్చయించి ఈ క్షేత్రమునకు వచ్చువారి వద్దకు నేను మాయా రూపమున తప్పక వచ్చెదనని తెలిపిరి. వేదవ్యాస మునీంద్రులు వారు శంకరభట్టుకు దత్తప్రభువుల యొక్క యోగశక్తిని గూర్చి, మహిమా విశేషములను గూర్చి ఇట్లు తెలిపిరి. ''యోగ సంపూర్ణమైన శ్రీ దత్తాత్రేయుల వారిది అర్ధనారీశ్వర తత్వము మహోన్నతమైన దివ్యభవ్య అవతార స్వరూపము. అఘరాశులను క్షణములో క్షీణింపజేయకలుగు శక్తి కలిగినది శ్రీ అనఘాతత్వము.''

అనఘా అనగా పాపము లేనిది అని అర్థము. ఎవరిని స్మరించుట వలన పాపములన్ని తొలగి, జన్మరాహిత్యమును పొందుదురో ఆ పరబ్రహ్మ స్వరూపమే అనఘుడు. శ్రీ దత్తాత్రేయుల వారే అనఘులు. నిరాకారమైన నిర్గుణతత్వం, సాకార సగుణ స్వరూపమై శ్రీ అనఘా దేవిగా వారి వామ భాగమునందు అవతరించినది. అణువణువుకూ శక్తిని ప్రసాదించు మహాశక్తియే దత్తశక్తి. దత్తుని శక్తియే అనఘాశక్తియని కూడా తెలియవలెను. సాధనలతో, నిశ్చల భక్తి విశ్వాసములతో, దివ్యమైన ప్రేమతో భగవత్ శక్తి సాధ్యమవుతుంది. 'శ్రీ దత్తాత్రేయులు అతి ప్రాచీనులు, నిత్యనూతనులు. దత్త సాంప్రదాయములో పాదుకార్చనకు అధిక ప్రాధాన్యత ఉన్నది. ఏలనన సృష్టి స్థితిలయముల

నొందుటకై ప్రేరణ నిచ్చు మహా సంకల్పమునకు మూల స్థానము పాదుకా స్థానము. శ్రీపాదుడనగా మోక్షశ్రీకి లేదా యోగశ్రీకి మూలస్థానమని అర్థము". శ్రీ అనఘాష్టమి వ్రతమును చేయుట వలన సర్వ పాపములను నశింప చేసుకొనవచ్చును.

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

ఇతిశ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృత

ద్వితీయ ఖండాతర్గత అనఘాష్టమి వ్రత కథాయాం

ప్రథమోధ్యాయః సమాప్తః

దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబర.

# ద్వితీయోధ్యాయం

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

బ్రహ్మ మానస పుత్రుడుగా ప్రసిద్ధి పొందిన అత్రిమహర్షి, ఆయన భార్య అనసూయ దంపతుల తపః ఫలితముగా బ్రహ్మ, విష్ణు, రుద్రాంశలతో దత్తాత్రేయుడు జన్మించెను. సాక్షాత్తు మహాలక్ష్మి స్వరూపమైన అనఘాలక్ష్మి భార్యగా అణిమ, లఘిమ, మహిమా, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ, కామావసాయితా అను ఎనిమిది మంది కుమారులు కలిగిరి. శ్రీ దత్తులు సహ్యాద్రియందు నిత్యమూ అనఘాదేవితో కూడి యోగభ్యాస నిమగ్నులై యుండువారు.

బ్రహ్మ నుండి వరములను పొందిన గర్వముతో జమ్భాసురుడను రాక్షసుడు ఇంద్రాది దేవతలను ముట్టడించి, ఓడించెను. దేవతలందరూ కులగురువగు బృహస్పతి సూచన మేరకు దత్తప్రభువుతో తమను రక్షించి ధర్మమును నిలుపమని వేడుకొనిరి. దత్తుడు వారికి అండగా నుందుననీ, భయము వలదనీ అభయము నిచ్చిరి. దేవతలు రాక్షసులతో కయ్యానికి కాలుదువ్వి, వారిని దత్తుల వద్దకు

రప్పించిరి. రాక్షసులు దత్తుని ఒడియందున్న అతిలోక లావణ్య వతియైన ముగ్ధను చూచి వచ్చినపని మరచి, అనఘాదేవిని ఎత్తి, నెత్తిపైకెక్కించుకొనిరి. లక్ష్మి ఎవరి శిరముపై నెక్కునో, వారి సంపదలూ, రాజ్యము, గృహములు, అన్యాక్రాంత మగును. మాయా శక్తికి చిక్కిన వారి శక్తిని ఆమె హరించివేయును. అదే అదనుగా ఇంద్రుడు జంభాసురుని సంహరించెను దేవతలకు వారి కష్టములు తొలగినవి అనఘాసమేత దత్తప్రభువులను దేవతలు ఎంతయో కీర్తించిరి దత్తప్రభువు దేవతలతో అనఘాలక్ష్మి తన యోగశక్తియే అని ఆమెను, భోగ వస్తువుగా భావించినచో వారి సర్వశక్తిని హరించే మాయాశక్తి కాగలదని తెలిపిరి.

సత్యజీవనము గడుపువారికి ఆమె సర్వశక్తి ప్రదాయినియై సర్వభోగైశ్వర్య ములు కల్పించును. మోక్షమునకు దారి చూపు జ్ఞానవైరాగ్యయోగ స్వరూపియై, మాతృత్వమును వర్షించు పరాశక్తిగా యుండును. భక్తిశ్రద్ధలతో అనఘాష్టమి వ్రతము సల్పువారు, నాతో ప్రత్యక్ష, సూక్ష్మ స్థితులయందు సంబంధము కలిగియుందురు. సర్వలోక, సర్వకాల, సర్వావస్థలయందు నా రక్షణలో యుందురు లేమియనునది పొడసూపదు అని తెలుపగా దేవతలు ఆనంద పరవశులైరి.

శ్రీకృష్ణుడు దత్తప్రభువు మహిమను తెల్పుతూ సంపూర్ణ శరణాగతి అవసరము. సదా దత్తనామ స్మరణ, అనఘాదత్తుల తత్వమును మననము చేయుట మాత్రమే గత్యంతరము, అని ధర్మరాజుకు వివరించెను. ప్రతీ సంవత్సరము మార్గశిర బహుళాష్టమినాడు అనఘాష్టమి వ్రతము చేయుట శుభప్రదము అని నుడివెను.

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

ఇతిశ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృత

ద్వితీయ ఖండాతర్గత అనఘాష్టమి వ్రత కథాయాం

ద్వితీయోధ్యాయః సమాప్తః

దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబర.

# తృతీయోధ్యాయం

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

పూర్వము హైహయ రాజ్యమును కృత వీర్య మహారాజు పాలించెను. అతడు సత్య ధర్మనిరతుడు, ధైర్యశాలి, పరాక్రమశాలి. సంతానము కొరకు వారు చేసిన పుణ్య క్రతువులు, పుణ్య వ్రతములు, పుణ్య కర్మల ఫలితముగా ఒక శుభముహూర్తమున ఒక కుమారుడు కలిగెను. కానీ పుట్టిన బాలుడు చొట్ట చేతులతో పుట్టెను. కుమారుడు పుట్టిన సంతోషము ఆ దంపతులకు కరువ య్యెను, కుమారునికి అర్జునుడు అని నామకరణము చేసిరి. కొంతకాలమునకు కృతవీర్యుడు స్వర్గస్తుడయ్యెను. రాజకుమారునికి పట్టాభిషేకము చేయవలెనని తలచిరి. కానీ కార్తవీర్యార్జునుడు ప్రజల వద్ద నుండి పన్నులు కట్టించుకొనుచూ, తన లోపముతో ప్రజల రక్షణ చేయలేక యున్నచో అది ధర్మ సమ్మతము కాదు కాబట్టి ముందుగా తపస్సు చేసి, యోగసిద్ధులను పొంది, సకలాస్త్ర వేత్త నైనపుడే రాజ్యాభిషేకమునకు అర్హుడనని రాజసభలో తన నిశ్చయమును ప్రకటించెను. కార్తవీర్యుని ఆలోచనకు మెచ్చి గర్గాచార్యులు, సహ్యాద్రి పర్వత ప్రాంతాన ఆశ్రమంలో ఉన్న శ్రీ దత్తాత్రేయ స్వామిని పూజింపుము. నీకు అన్ని శుభములు కలుగును అని తెలిపిరి. కార్తవీర్యుడు తక్షణమే సహ్యాద్రికి చేరు కొనెను. దత్తుడు దిగంబరుడై చూచుటకు భీతి కలుగునటుల అనాచారుడిగా మత్తులో తేలియాడుచూ, చెంతనున్న సుందరితో సరసములాడుచూ, అసభ్యపద జాలముతో కేకలు వేయుచూ జుగుప్సను కలిగించు రీతిలో భ్రష్టులుగా కనిపించెను. కులగురువైన గర్గాచార్యులు తనతో చెప్పిన మాటలు గుర్తుంచుకొని, దత్తుని పాదములు పట్టుకొని సేవలు చేసెను. దత్తప్రభువు కార్తవీర్యునిపై కరుణ కలిగి, తన తత్త్వమును పూర్తిగా తెలుసుకున్న అర్జునుని అనుగ్రహింపదలచి, వరమును కోరుకొమ్మనెను. కార్తవీర్యుడు రాజధర్మమును ఉపదేశింపుమనెను. అష్టసిద్ధులు ప్రత్యక్షమై కోర్కెలు తీర్చునటుల వరమిమ్మనెను. సన్మార్గములో నడిపింప గలుగు ఉత్తమ గురువుల నిమ్మనెను. దేశ ప్రజలు ఎటువంటి

అసంతృప్తి లేకుండగ, సుఖ సంతోషములతో ఉండునటుల ఆశీర్వదింపుమనెను. శ్రీదత్తుడు కోరిన అన్ని వరములనూ కార్తవీర్యునికి అనుగ్రహించెను. కార్తవీర్యుని పాలనలో రాజ్యము దేవ భూమిని తలపించినది. ధర్మమునకు నిలయమై దాన ధర్మములు నిరంతరము జరుగుచుండెడిది. తండ్రికి మించిన కీర్తివంతుడయ్యెను. స్వర్ణ యుగమును సృష్టించెను. దత్తానుగ్రహముచే చొట్ట చేతులు గల కార్తవీర్యార్జునుడు సహస్ర బాహువై పేరొందెను. కొన్నివేల సంవత్సరములు పరిపాలించెను. రాజ్యములోని సర్వజనులు శ్రీ అనఘాష్టమీ వ్రతమును ఆచరించి, సర్వ పాపముల నుండి విముక్తులై మోక్షమునందిరి. అనఘుని మహిమ, వైశిష్ట్యములు కొనియాడబడెను. ఇందలి తత్త్వార్థమును గ్రహించువానికి తపోఫలము దక్కును అని శ్రీకృష్ణుడు ధర్మరాజునకు తెలిపెను.

## కార్తవీర్యుని గర్వభంగము :

దత్త ప్రభువు కరుణతో మహా సంపన్నుడైన కార్తవీర్యార్జునుడు తదనంతర కాలమున బ్రాహ్మణ, యతి, ఋషులు, సన్యాస, సాధుసత్పురుషులను నిర్లక్ష్యము చేయుచూ అహంకార పూరితుడయ్యెను. గర్వభంగము కావలసిన తరుణమాసన్నమై అతనిని జమదగ్నిముని ఆశ్రమమునకు తరముకొని వచ్చినది.

కార్తవీర్యుడు తన సేవాదళముతో ఆశ్రమమునకు వచ్చినంతనే జమదగ్నిముని లక్ష్మీ సహోదరియగు కామధేనువు సహకారముతో క్షణకాలములో విందు భోజనమును ఏర్పాటు చేసి అతిథి మర్యాదలు జరిపెను. అసూయకు వశమైన కార్తవీర్యుని దృష్టి అంతయు కామధేనువుయందు నిలిచెను. బ్రాహ్మణ సంపదను అపహరించుట అధర్మమని తెలిసిననూ, శాంతపరుడైన మహర్షి ఏమి చేయగలడన్న అహముతో జమదగ్ని మునిని ధిక్కరించి, లక్ష్మీతుల్యమగు ఆ కామధేనువును బలవంతముగా తన రాజ్యమునకు తోడ్కొని పోవుచుండెను.

విషయము నెరిగి ఆగ్రహోదగ్రుడైన జమదగ్ని, రేణుకల పుత్రుడు పరశురాముడు మహిష్మతీపుర రాజధానిలోనికి ప్రవేశించుచున్న కార్తవీర్యునితో

యుద్ధము చేసి, సంహరించి, కామధేనువుతో ఆశ్రమమునకు చేరుకొనెను. మరికొంత కాలమునకు కార్త్యవీర్యుని పుత్రులు ఆశ్రమమును చేరి జమదగ్ని శిరమును ఖండించి పోయిరి. అది తెలిసిన పరశురాముడు ప్రళయాగ్ని రుద్రుని వలె ఆవేశముతో కార్త్యవీర్యుని వంశమునంతటినీ హతమొనర్చి ఆశ్రమమునకు చేరెను. తల్లి ఆజ్ఞానుసారము తండ్రి జమదగ్ని శరీరము తీసుకుని, సహ్యాద్రిలోని దత్తప్రభువు ఆచార్యత్వమున తండ్రికి దహన సంస్కారములు చేసెను. తన ప్రతిజ్ఞననుసరించి, భూమండలమును చుట్టి అధర్మవర్తునులైన క్షత్రియులను నాశనమొనర్చెను. ప్రణీతా నదీ తీరమున తపస్సు చేసి, కశ్యపుని ఆధ్వర్యములో అశ్వమేధయాగమును చేసెను. యావత్ భూమండలమును, సాధుసత్పురుషులకు, బ్రాహ్మణులకు దానము చేసి, భార్గవరాముడు కృతకృత్యుడయ్యెను. తర్వాత దత్తుడు పరశురామునికి త్రిపురా రహస్యమను యోగవిద్యను బోధించెను, అని శ్రీకృష్ణుడు ధర్మరాజుకు తెలిపెను. నిజతత్వమును తెలుసుకొనిన ధర్మరాజు మహదానందమును పొందెను.

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

ఇతిశ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృత
ద్వితీయ ఖండాతర్గత అనఘాష్టమి వ్రత కథాయాం
తృతీయోధ్యాయః సమాప్తః

దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబర.

# చతుర్థోధ్యాయము

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

ధర్మరాజు శ్రీ కృష్ణుని అమలకాశ్రమ వృత్తాంతమును వివరింపుమని కోరెను. అందులకు శ్రీ కృష్ణుడు ఆమలకాశ్రమమును గురించి స్కందుడు కొన్ని వివరములు తెలిపెననెను. లోకములను సృజించు చతుర్ముఖుడు మొదట దేవదానవులను, మానవులను, భువనములు, వర్ణములు, ఆశ్రమములు మొదలైనవి సృష్టించెను. మానవులు వేదదృష్టి కలిగి, నిశ్చలమతులుగా, ఆత్మవిదులుగా, శాస్త్రచింతకులుగా ఉండుటవలన సృష్టి లక్ష్యము నెరవేర కుండెను. తరువాత బ్రహ్మ ఆలోచించి మానవులను మోహములో పడవేయుటకై మోహము, తమము వంటివి సృష్టించెను. అట్టి అవిద్యయందు, మాయామోహ ములను సృజించుచూ మోహములో పడి చతుర్ముఖుడు తానే వేదమును మరచెను. గాయత్రియే కానరాకుండెను. బ్రహ్మ జగన్మాతయైన రేణుకను ప్రార్థించగా రేణుక ప్రత్యక్షమై దత్తుని ఆశ్రయింపుమనెను. చతుర్ముఖుడు తెలుసుకొన గోరిన విషయమును నీవతనికి తెలియపరచుమని రేణుకామాత శ్రీదత్తునితో చెప్పెను. శ్రీ దత్తుడు రేణుకాదేవి చరణములకు మొక్కి బ్రహ్మకు తాను తెలుపగలుగు వివరము గూర్చి అడిగెను. బ్రహ్మతాను మరచిన వేదవేదాంగ ములు ఉపనిష త్తులు మొదలైనవన్నింటినీ మరల ఎట్లు తెలుసుకొనవచ్చును అని అడిగెను. శ్రీదత్తుడు సమాధానముగా అన్ని వర్ణములందు, అనంతమైన, ఏకమైన ఓంకారనాదమే నిండి యున్నది. అట్లే లోకాలకాధారభూతురాలైన, ఆదిపరాశక్తి, సావిత్రి కూడా రేణుకామాతయే అని తెలిపెను. బ్రహ్మ అనఘాలక్ష్మిని, రేణుకను స్తుతించి, వేదవిదుడై హర్షపులకితుడై సత్యలోకమునకు వెడలెను. బ్రహ్మకు తిరిగి వేదములను స్ఫురింపజేసిన దత్తుడు, రేణుకామాత, బ్రహ్మను విష్ణువును చూచిరమ్మని పంపగా, సర్వ జంతువుల హృదయములందువసించు ప్రభువగు విష్ణువును చూడలేకపోయెను. విద్యుత్పుంజము వలెనున్న ఒక మహా వృక్షము అచట ఉండుటవలన ఆ గ్రామమునకు ఆమలక గ్రామము అని

పేరు వచ్చెను. అదే ఇప్పుడు మాతాపురముగా పిలువబడుచున్నది. పరశు రామునితో రేణుకాదేవి ఆమలక వృక్షమునందు విష్ణువు, శివుడు బ్రహ్మయును ఉండుటవలన దేవత్రయాత్మకమైనది కావున, ఉసిరిక వృక్షమును ఈ ఆశ్రమమునందు నాటుము అని చెప్పెను. కృష్ణామలకిని స్పృశించినను, చూచినను, అంజలి ఘటించి, ప్రదక్షిణము చేసినను జీవులు సద్గతిని పొందుట నిశ్చయము. ఆమలక వృక్ష రూపుడైన శ్రీహరిని పురుషులుగానీ, స్త్రీలు గానీ, ఎవరైననూ త్రిదేవ మయమైన, మాన్యమైనటువంటి సహ్యాద్రికే కేతువు వలె భాసించుచున్న ఈ ఆమలక వృక్షమును భక్తితో చూచిన చాలును, దివ్యలోక సుఖములను ఈ జన్మయందే అనుభవించగల్గుదురు. రాబోవు జన్మలలో అమరసుఖములను పొందగలుగు దురు. ఆమలక వృక్షము యొక్క ప్రభావమిది యని బాదరాయణులు శంకరభట్టునకు సందేహము నివృత్తి చెసెను.

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

ఇతిశ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృత
ద్వితీయ ఖండాతర్గత అనఘాష్టమి వ్రత కథాయాం
చతుర్థోధ్యాయః సమాప్తః

దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబర

# పంచమోధ్యాయము

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

## అష్ట సిద్ధుల వివరములు

అనఘాష్టమి వ్రతము యొక్క తత్త్వార్థమును తెలిసి, సర్వస్య శరణాగతులై సంపూర్ణ భక్తి ప్రపత్తులతో పూజించినవారు అనఘాదత్తుల అనుగ్రహమునకు పాత్రులగుదురు అని వేదవ్యాస మునీంద్రులు తెలిపిరి. ఆనఘాదత్తుల మూల తత్వమును తెలుసుకొని, యోగమును సాధించిన వారికి అష్టసిద్ధులు వరించునని తెలుపుటకే అష్టసిద్ధులు అష్ట పుత్రులుగా జన్మించిరి. అవి అణిమ, లఘిమ, మహిమ లేదా గరిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ, కామావసాయిత లేదా యత్కామ తదావశ్యతి అనునవి.

అణిమ అనిన అణుతర రూపముగా మారి అదృశ్యమవగల్గుట ఈతడు అనఘదేవునకు ఈశాన్యమున నుండును.

లఘిమ అనిన సూక్ష్మ బుద్ధిని కలిగి అతి తేలికై బహు శీఘ్రముగా సాధించగల్గుట ఈతడు అనఘదేవునకు ఆగ్నేయమునందుండును.

మహిమ లేదా గరిమ అనిన జగములన్నిటిచే పూజలందుకొనును. శరీర బరువును పెంచగల్గుట. ఈతడు స్వామికి ముందు భాగమున పాదములచెంత నిలచి యుండును.

ప్రాప్తి యనిన ఆయా అవయవాల ఇంద్రియ జ్ఞానాన్ని కలిగించే సిద్ధిని పొందుట. ఈతడు నైఋతి కోణమునందుండును.

ప్రాకామ్యయనిన ఒకేసారి అంతటా వ్యాపించియుండి ఇతర లోకాల్లోని వస్తువులు, అదృశ్యంగా ఉన్న వాటిని చూడగలుగు స్వేచ్ఛాసంచార స్వభావమును కలిగియుండుట. ఈతడు వాయవ్య మూలయందుండును.

ఈశిత్వమనగా శరీరాలకు ప్రాణులకు ప్రేరణ కలుగజేయుట, సహజ శక్తులపై నియంత్రణ కలిగియుండుట, ఈతడు అనఘస్వామికి కుడి భాగము నందుండును.

వశిత్వమనిన సర్వేంద్రియములను తన వశమునందుంచుకొన గల్గుట. ఈతడు అనఘునకు వామ భాగమునందుండును.

కామావసాయిత మనగా ముల్లోకాలలోని ఆనందాలను, అప్రయత్నముగా కోరుకున్నంతలోనే కోరినదాన్ని పొందగల్గుట. ఈతడు అనఘస్వామికి వెనుక భాగమునందుండును.

ఈ స్థితిలో కోర్కెలకు తావులేని బ్రహ్మానందం ఉంటుంది. నిజమైన ఆత్మ స్థితిని పొందగోరువారు, ఈ అష్టసిద్ధుల మాయకు లోబడక ఉదాసీనతనొంది, అచ్యుత స్థితినందు ఉందురు. అష్టదళ మధ్య భాగమునందున్న బ్రహ్మ, విష్ణు, శివాత్మకుడు, గురు స్వరూపుడగు శ్రీ అనఘదత్తుడు కరుణాంతరంగుడు మనల రక్షించును.

అని శ్రీకృష్ణుడు ధర్మరాజునకు శ్రీ అనఘాష్టమీ వ్రత కథలను, వాటి మహిమలను వివరముగా తెలిపెను.

ఇహపర సుఖములను కల్గించు ఈ వ్రతమును వీలునుబట్టి యావ జ్జీవితము చేయవలెను. శ్రీపాదుల ఆజ్ఞచేత చెప్పిన అనఘాష్టమీ వ్రతమును భక్తి శ్రద్ధలతో ఆచరించిన వారికి, శ్రద్ధతో ఆలకించిన వారికి సత్సంతానము కల్గును. ఋణ బాధ తొలగి సకలైశ్వర్యములు సిద్ధించును. నూతన గృహ ప్రాప్తి, ఆయురారోగ్యములు కలుగును. సద్గురు కృపా కటాక్షములు కలిగి, సర్వపాపములు తొలగి మోక్ష పథమునకు మార్గము సుగమమగును.

అనఘాష్టమీ వ్రతమును గూర్చిన రహస్యాతి రహస్య విషయములన్ని తెలిపి, సర్వమనోరథ చింతామణియైనటువంటి అనఘావ్రతమును బహుళాష్టమి తిథినాడు జరిపి, దత్త ప్రసాదములను పొందుమని ఆశీర్వదించిరి.

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే అంటూ శ్రీబాదరాయణులవారు పాండురంగ విఠల మూర్తికి నమస్కరిస్తూ, అదృశ్యులైరి.

శ్రీపాదరాజం శరణం ప్రపద్యే

ఇతిశ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృత
ద్వితీయ ఖండాతర్గత అనఘాష్టమి వ్రత కథాయాం
పంచమోధ్యాయః సమాప్తః

దిగంబరా దిగంబరా శ్రీపాద వల్లభ దిగంబర.

# ఆరోగ్యమే - మహాభాగ్యము

## ప్రకృతి చికిత్సతో కాన్సర్ వ్యాధి నివారణ
## అపక్వ ఆహారములతో కాన్సర్ వ్యాధి నివారణ

పచ్చి కూరల ప్రభావము నాకు సరిగా తెలియనప్పుడు ఇతర డాక్టర్ల వలె నేను కూడా రోగము రాకుండా చేయడం ఎలాగో తెలియక, రోగ లక్షణములకు చికిత్స చేశాను. ఇక ముందైనా డాక్టర్లు రోగం వచ్చాక రోగం నయం చేయుటకు ప్రయత్నించడం కంటే రోగం రాకుండా చేయడానికి ఉపాయములను హెచ్చుగా అన్వేషించాలి. నేను డాక్టర్ని అయినా రోగి అయినందుకు, అందునా ఘోర జాడ్యము నన్ను ఆవరించినందువల్ల ముఖ్యముగా నేను పచ్చి కూరలని ఆహారముగా ఉపయోగించాను. నాకు రొమ్ములో కాన్సర్ ఏర్పడింది. దీనికి ముఖ్య కారణము 12 సంవత్సరములు ఆసుపత్రిలో పని చేసినప్పుడు నేను తిన్న ఆహారమూ, నేర్చుకున్న దురలవాట్లు మాత్రమే. ఆ రోజుల్లో నాకు ఆకలి మందగించి ఉండేది. ఆసుపత్రిలో పని చేసేవాళ్ళకి ఇచ్చే ఆహారములో మార్పేమీలేదు. ఒకప్పుడు నాకు కడుపులో రక్తస్రావంతో ఏర్పడిన పుండు వల్ల చావుకి సిద్ధమయ్యాను. అందువల్ల మద్యమాంసములు మాని పూర్తిగా శాఖాహారినయ్యాను. తరువాత చాలామటుకు పచ్చి కూరలనే ఆహారంగా తీసుకోవడం అలవాటు చేసుకున్నాను. ఇలా చేయడం వల్ల రోగం పూర్తిగా నిశ్శేషముగా నయం కాలేదు. కాని, జీర్ణశక్తి పెరిగి హాయిని ఇచ్చింది. 1940 శీతాకాలం మొదలు 1941 శీతాకాలం వరకు నాకు అతినిస్త్రాణంగా ఉండేది. చాలా మందకొడిగా ఉండేదాన్ని. ఫలానా రోగమని నిర్ణయించజాలక అయోమయస్థితిలో ఉన్నాను. వసంతకాలం వచ్చేటప్పటికి రొమ్ములో ఒక చిన్న గడ్డ కనపడింది. మందకొడితనం వల్ల నిస్త్రాణంగా ఉండడం వల్ల ముందు ఆ గడ్డని అప్పుడు నేను అంతగా పట్టించుకోలేదు. 5 వారాల తర్వాత అది పెరిగి కోడిగుడ్డంత లావయ్యి చర్మగడ్డలాగా తయారయింది. చర్మగడ్డ అంటే కాన్సర్ అన్నమాట. నేను డాక్టర్ని కనుక కాన్సర్‌కి మామూలుగా చేసే చికిత్సలన్నీ నాకు

అనుభవమే. కాబట్టి ఆ చికిత్సలు చేయించుకోవడం నాకెంత మాత్రమూ ఇష్టము లేకపోయింది. ఈ విషయములో నా ముఖ్య స్నేహితుడు డాక్టర్ హింద్‌హెడి (Dr. Mikkel Hindhede) గారితో సంప్రదించాను. ఆయన ట్రయల్ మైక్రోస్కోప్ వద్దన్నాడు. దాని వల్ల రక్తవాహికలు తెగి కాన్సర్ ఇంకా వ్యాపిస్తుంది అని అన్నాడు. అందువల్ల ఆ ప్రయత్నం మానేశాను. ఇక నూటికి నూరుపాళ్ళు పచ్చి కూరలు తినటమే మార్గమని నిశ్చయించుకున్నాను. ప్రకృతి జీవన మార్గాలని అన్వేషించాను. ఒక చిన్న దీవిలో నివాసమేర్పరచుకున్నాను. రోజు నాలుగైదు గంటలు ఎండలో కూర్చునేదాన్ని. గాలి వెలుతురు పుష్కలంగా ఉండే గుడారంలో ఉండేదాన్ని. రోజుకు అనేక పర్యాయములు స్నానం చేసాను. పూర్తిగా పచ్చి కూరలు ఆహారంగా తీసుకున్నాను. తర్వాత హ్యూమ్లేగార్డెన్ (Humlegarden) శానిటోరియంలో ఈ పద్ధతులే ప్రవేశపెట్టాను. ఇలా చేస్తున్నా మొదటి రెండు నెలలు నిస్త్రాణంగానే ఉండేది. రొమ్ములోని గడ్డ ఏమీ తగ్గలేదు. తర్వాత మార్పు కనిపించింది. గడ్డ తగ్గడం ఆరంభించింది. నేను కోలుకున్నాను. లోగడ అనేక సంవత్సరముల నుండి ఎరగని సుఖమూ, సంతోషమూ అనుభవించడం మొదలు పెట్టాను.

ఇలా ఒక సంవత్సరం చక్కని ఆరోగ్యం అనుభవించాక అయినా చూద్దాం అని నా స్నేహితుడు హింద్‌హెడి ఇచ్చిన సలహాను అనుసరించి ఉడకపెట్టిన కూరలు, రొట్టె, సగం ఉడికిన కూరలు తినడం ఆరంభించాను. లాభం లేక పోయింది. మూడు నెలల తర్వాత రొమ్ములో సూదిపోట్లు మొదలైనాయి. బాధ చాలా ఎక్కువయింది. మళ్ళీ కాన్సర్ పెరగడం మొదలు పెట్టింది. తిరిగి మళ్ళీ పచ్చి ఆహారం తినడం ప్రారంభించాను బాధ వెంటనే తగ్గింది. నిస్త్రాణ అంతగా కనిపించలేదు. నేను డాక్టర్ని కాబట్టి నా అనుభవం రోగుల, మానవుల క్షేమం కోసం వినియోగించడం మంచిదని నిశ్చయించుకున్నాను. మరుసటి వేసవిలో నాతోపాటు నలుగురైదుగురు రోగుల కోసం సరిపడే ఇల్లు అద్దెకు తీసుకున్నాము. మేమందరమూ నూటికి నూరుపాళ్ళు పచ్చి కూరలు తినడం ప్రారంభించాము.

చాలా చక్కగా పనిచేసింది. కాని నాకు ఈ చికిత్స కొద్ది మందికే పరిమితం చేయడం ఎంత మాత్రమూ తృప్తిని కలిగించలేదు. ఈ చికిత్స వల్ల మేలు కలుగుతుందని లోకానికి ఋజువు చేసి ఈ ఉద్యమం వ్యాపింపచేయాలంటే పెద్ద ఎత్తున ప్రయత్నం చేయడం మంచిదని నాకనిపించింది. అందుకుగాను నా సలహానుసరించి ఒక వ్యాపార సంస్థ నెలకొల్పబడి, హ్యూమ్లేగార్డెన్ అనే తోట ఇంటిని కొన్నాను. ఆ తోట ఇల్లు నేను స్థాపించదలచుకున్న శానిటోరియంకి చాలా అనుకూలంగా ఉంది. శానిటోరియంకి నేను అధిపతిగా ఉన్నాను. దీనిలో ఉండే రోగులు, నౌకర్లు అందరమూ పచ్చి ఆహారం తింటాము. ఇది స్థాపించి ఇప్పటికీ అంటే 1959 నాటికి ఆరేళ్లయింది.

మంచిదేకాని నాగరికులమని చెప్పుకునే ఈ కాలపు మానవులకు సమగ్రమైన పచ్చి కూరల ఆహారం ఇంత మేలు చేయడానికి కారణమేంటి? అన్నింటికంటే మొదటిది, ముఖ్యమైనది ప్రకృతిమాత మనకి సరాసరి అందించిన పచ్చి ఆహారం. లోకమునందలి జీవకోటి పుట్టుక, మనుగడలు సూర్య భగవానుని మీదనే ఆధారపడి ఉన్నాయని మనకందరికి తెలుసు. సూర్యుడే లేకపోతే ఈ భూమండలము చిమ్మచీకటితోను, గడగడా వణికించే చల్లటి గాలులతోను నిండి ఉండేది. ఒక్క ప్రాణి కూడా జీవించి ఉండేదికాదు. ప్రాణమన్నా, సూర్యుని శక్తి అన్నా ఒకటే, ఏమీ తేడా లేదు. చెట్లు-చేమలు గాలిలో చక్కగా నలుమూలలా విస్తరించి తమ పచ్చని లక్షలాది ఆకుల ద్వారా సూర్యరశ్మిని గ్రహించి దానిని తమ వేళ్ళలో, దుంపలలో, కాయలలో, పళ్ళలో, గింజలలో దాచి ఉంచుతాయని డాక్టర్ హెస్సేలింక్ (Dr. Hesselink) చెప్పారు. స్థూల శరీరులగు మానవులు, మృగములు సూర్యరశ్మిని ఎక్కువగా గ్రహించజాలరు. అందుకనే మానవులు, పశువులు కూడ సూర్యరశ్మి కొరకు చెట్లు ఇచ్చే వేళ్ళు (roots like Carrots బీట్) కాయలు, కూరలు, దుంపలు (tubers like potato etc), పళ్ళు (fruits), గింజలు (seeds) తిని వాటి ద్వారా సూర్యరశ్మిని గ్రహించవలసిన అవసరం కలిగినది. చిగుళ్ళు, పచ్చి కూరలు తినడమంటే సూర్యరశ్మిని తినడమే. అందుకేమీ

అనుమానం లేదు. జురీష్ వాసియగు డాక్టర్ చిర్ చర్ బెన్నర్ ఈ రహస్యాన్ని ఎప్పుడో గ్రహించారు. అణువులు శక్తి వాహకాలని హాలండ్ దేశస్థుడైన డాక్టర్ హెస్‌లింక్ చెప్పారు. కాబట్టి తాజా పచ్చి కూరలలో పరిపూర్ణమైన ఆహారముంది. ఉడకబెట్టినా, వేరే ఏం చేసినా, దాని విలువ తగ్గనన్నా తగ్గుతుంది, లేదా పూర్తిగా నాశనమన్నా అవుతుంది. వండిన కూరలకి రుచి పచి ఏమీ ఉండనే ఉండదు. వాటిలో మనం రకరకాలైన వస్తువులని కలుపుతూ పంచదార, మసాలా వస్తువులు మిర్చి వగైరా వగైరా ఎన్నో మేళవిస్తాం. గోధుమల మొలకలలో పై పొట్టును తీసివేసి కాని రొట్టెపిండి తయారు చేయము. బియ్యాన్ని, చక్కెరను పాలిష్ చేయించి వాటిని తెల్లగా చేయిస్తాం. ఆపిల్ పండు పై చర్మాన్ని, లోపలి గింజలని పారవేస్తాం. బంగాళ దుంపలు, క్యారట్‌లు (Carrots) మీద ఉన్న పై పొట్టును తీసివేస్తాం. మాంసము, చేపలు, గుడ్లు ద్వారా మనకు కావలసిన దానికన్నా ఎక్కువగా మాంసకృత్తులను పొందుతున్నాము. కాఫీ, టీ, కోకో మొదలగు ఉద్రేకము కలిగించే విష పానీయాలని తయారు చేసి త్రాగుతున్నాం. అమృతముతో సమానమైన ద్రాక్షరసము నుండి సారాయిలు (Country లిక్కర్), బ్రాందీలు (brandy) మొదలగు మత్తు పదార్థాలని (intoxicants) తయారు చేస్తున్నాం. ఆహారపు నాళం చెడకుండా ఉండడానికి, కంటికి ఇంపుగా కనపడునట్లు చేయడం కోసం రకరకాలైన రసాయనక పదార్థాలు ఉపయోగి స్తాము. రకరకాల నొప్పులు తగ్గడం కోసం నిద్రపట్టడానికి, ఆందోళన తగ్గడం కోసం, విరోచనాలు అవడానికి ఘాటైన మందులు వాడతాము. ఇవన్నీ శరీరములో కలవని అన్య పదార్థములు. ముఖ్యముగా తలనొప్పి పోగొట్టుటకు, విరోచనములు అగుటకు వాడే మందు బిళ్ళలకి అంతు-పంతు లేదు. డెన్మార్క్ వంటి చిన్న దేశములో తలనొప్పి తగ్గే మందు బిళ్ళలు, నూటాయాభై టన్నులు, విరోచనాల మందు బిళ్ళలు పదిహేను టన్నులు, నిద్రపట్టే బిళ్ళలు తొమ్మిది టన్నులు తింటున్నారని ఆ దేశపు వైద్యాధికారులు చెప్పిన లెక్కలవల్ల తేలింది. పెద్దపెద్ద దేశాల్లో ఎన్ని వేలు, ఎన్ని లక్షల టన్నులు ఈ మందుబిళ్ళలు తింటున్నారో చెప్పలేము. పొగాకులో ఉన్న నికోటిన్ (Nicotene) అనే విషం

సారాయిలో ఉన్న విషం కన్నా ఘాటైనది. దాని వల్ల గుండె దెబ్బ తింటుంది. గట్టిగా ఉండవలసిన గుండె మెత్తబడి క్రిందకు జారుతుంది. నికోటిన్ వల్ల గుండె ఆగి ఎంతోమంది యాభై ఏళ్ళకే చనిపోవడం మనం చూస్తున్నాము. పచ్చి ఆహారం తినేవారికి పొగాకు మీద క్రమంగా అసహ్యం కలుగుతుంది. రసాయనిక ఎరువులు మితిమీరి వాడి భూమిని కూడా చెడగొడుతున్నాం. రసాయనిక ఎరువుల వాడుక వల్ల భూమి గుల్లపడి అది కూడా భూమి మానవుల వలె రోగిష్టిలాగా తయారయ్యే ప్రమాదం ఉంది. అటువంటి భూమిలో పండే పంటలు కూడా రోగిష్టివే అయి మానవుల ఆహారానికి వినియోగించడానికి వీలు లేకుండా ఉండే ప్రమాదం ఏర్పడవచ్చును.

పచ్చి ఆహారానికి నేను ''అమృతాహారం'' అని వండిన ఆహారానికి ''మృతాహారము'' అని నామకరణం చేశాను. శరీరమునకు విరుద్ధమైన ఆహారాలు వినియోగించినందువల్ల అవి పెద్ద పేగులో చాలా కాలం నిలిచిపోయి మురిగి పోతాయి కనుక అటువంటివి తినకుండా జాగ్రత్తపడాలి. అస్వాభావికముగా వండిన ఆహారము కన్నా స్వాభావికమైన ఆహారమే శ్రేష్టమైనది. అంతేకాదు, అది అమృతాహారము, అతి తేలికగా జీర్ణమవుతుంది. అవే వండిన కూరలయితే జీర్ణమవడానికి 3 గంటలు పడుతుంది. మలము పాడువాసన కూడా దానివల్లనే వస్తుంది. దానివల్ల శరీరంలో తయారయ్యే రక్తం అపరిశుభ్రంగాను, విషయుక్తం గానూ ఉంటుంది. అవయవాలను చెడగొడుతుంది. పచ్చి ఆహారంలో ఉండే జీవపదార్థాలు, విటమిన్లు సహజ స్థితిలో సరైన పాళ్ళలో ఉండడంవల్ల శరీరంలోని అవయవాలను చెడగొట్టకపోగా బలపరుస్తాయి. ఇప్పటి మానవులకు కలుగుతున్న పలువిధాలైన శరీరం మనోజాడ్యాలకు ప్రబల కారణం ప్రస్తుతం మనం తింటున్న ఆహారమేనని కొంచెం ఆలోచించగలవారు సులభంగా గ్రహించగలరు. ఇప్పుడు, ఇకముందు కూడా మనం ఆరోగ్యంగా జీవించాలి అనుకుంటే ఇప్పటికంటే ఆరోగ్యప్రదమైన ఆహారము తినాలి. ఆరోగ్యప్రదమైన అలవాట్లు అలవరచుకోవాలి. ప్రాణమునకు, ఆరోగ్యమునకు సంబంధించినంత

వరకు రాజీకి అవకాశం లేదు. నూరుపాళ్ళు పచ్చి ఆహారం తీసుకోవాలి. రకరకాల రోగాలలో అది మనకెలా సహాయకారిగా ఉంటుందో ఆలోచిద్దాం.

పచ్చి ఆహారం చేసే మేలు కొంతవరకు వ్యక్తి ప్రస్తుత ఆరోగ్యంమీద, వయస్సుమీద, కొంతవరకు లోగడ తింటూ వచ్చిన పక్వాహారం, దురలవాట్లు, శరీరాన్ని ఎంతవరకు శిథిలపరచాయో, వాటి మీద ఆధారపడి ఉంటుంది. లోగడ ఎన్ని దోషాలు చేసినా శరీరం పని పాటలు చేయగలిగే స్థితిలో ఉంటే చక్కగా మనం తినే పచ్చి ఆహారాన్ని జీర్ణించుకుని వంట పట్టించుకోగల శక్తి ఉంటుంది. ఏ జన్మలోనో మనం సంపాదించుకున్న రోగాలను, వంశానుగతముగా సంక్రమించిన రోగాలను అన్నింటినీ కూడా పచ్చి ఆహారం నయం చేస్తుంది. పక్వాహారముల వల్ల గర్భములో ఉన్న శిశువునకు కూడా అపకారం కలిగే ప్రమాదముంది. ఆహారపు గింజలలో ఉన్న జీవపదార్థము నాశనం అవటంవల్ల ఎన్నోరకాలైన వ్యాధులు రావటానికి వీలుంది. పక్వాహారం తిన్న తల్లి రక్తము అపరిశుద్ధమైనందువల్ల, తల్లి నుండి ఆహారం గ్రహించే గర్భస్థ శిశువుకు నష్టం జరగవచ్చు. శిశువు రోగిష్టిగా పుట్టవచ్చును. పుట్టిన తర్వాత అపరిశుద్ధమైన ఆ తల్లి పాలు త్రాగి క్రమంగా క్షీణించవచ్చును. ఇప్పుడు ప్రపంచములో అన్నిచోట్లా శిశువులు కొందరు స్వల్ప దుర్భలులుగానూ, కొందరు అధిక దుర్బలులుగానూ ఉన్నారు. దీని ఫలితం ఎలా పరిణమిస్తుందో ఎవరూ ఊహించలేకుండా ఉన్నారు. కాబట్టి మానవకోటి పచ్చి ఆహారం ఎంత తొందరగా తినడం ప్రారంభిస్తే అంత త్వరగా మేలు పొందగలరు. ప్రకృతి పిల్లలకి సహాయకారిగా ఉంటుంది. పచ్చి ఆహారం మొదలుపెట్టగానే తల్లికి పుష్కలంగా పాలు పడతాయి. బిడ్డ అనేక విధాలుగా హాయిగా ఉంటుంది. పాలకి తోడుగా నూరిన పళ్ళు, కూరలు, పిల్లలకి పెట్టవచ్చు. కాని పళ్ళూ, కూరలు ఎప్పుడూ ఒకే సమయంలో పెట్టకూడదు. వేరు వేరు సమయంలో పెట్టాలి. పరిశుభ్రమైన తల్లిపాలు, పండ్లు కూరలు తింటున్న బిడ్డలలో మనం నమ్మలేనంత మంచి మార్పు మనకి అతి శీఘ్రంగా కనపడుతుంది. కొన్ని నెలల వరకూ పూర్తిగా పచ్చి ఆహారం తిన్న

బిడ్డలు ఉన్న కొన్ని కుటుంబాలు నాకు తెలుసు. వారి మగ పిల్లలు, ఆడపిల్లలు అందరూ ఎంతో ఆరోగ్యంగా, ఆనందంగా చురుకుగా, ముచ్చటగా కేరింతలు కొడుతూ ఆడుతూ, పాడుతూ ఉండడం నేను చూశాను. చిన్న పిల్లలు చెడకుండా ఉంటారు కనుక ప్రకృతి వెంటనే వారికి తోడ్పడుతుంది. అందువల్ల సమగ్రమైన పచ్చి ఆహారం వారికి తక్షణం మేలు చేస్తుంది. యువకులకు, మధ్య వయస్కులకు కూడా పచ్చి ఆహారం మేలు చేస్తుంది. అని అనడంలో సందేహము లేదు. కాని పిల్లల్లో కనిపించినంత త్వరగా ఆ మేలు పెద్దలలో కనిపించదు. పచ్చి ఆహారం వల్ల పెద్దవాళ్ళ మనోవృత్తులు కూడా పూర్తిగా మారిపోతాయి. వారిలో నిగ్రహం, శాంతి, సౌహార్ద్రం, దయాదాక్షిణ్యాలు మొదలైన సద్గుణాలు ఏర్పడతాయి. ఇక ముసలివాళ్ళ సంగతి ఏమిటంటారా కొంచెము జబ్బుతో ఉన్న ముసలివాళ్ళు ఎక్కువ జబ్బుతో ఉన్న ముసలివాళ్ళు పచ్చి ఆహారం, తింటే ఏమైనా లాభం కలుగుతుందా లేదా? ముసలివాళ్ళకి కూడా లాభం కలుగుతుంది. కాని వారు కొంచెం ఓపిక, శ్రద్ధ చూపాలి. ఈ ఆహారం ప్రారంభించిన ప్రథమ దశలో వారు బాగా విశ్రాంతి తీసుకోవాలి. కొత్త ఆహారానికి, కొత్త అలవాట్లకు, కొత్త జీవితానికి అలవాటుపడ్డ కొద్ది రోజులకి వారికి హాయి చిక్కుతుంది. రోజుకి రెండు మూడు సార్లు చక్కగా విరోచనమవుతుంది. దానివల్ల చాలామందికి ఎనలేని ఉత్సాహం కలుగుతుంది. మా శానిటోరియంలో రోగికి ఉపయోగించే పదార్థములలో వెల్లుల్లి (garlic) గొప్ప స్థానమును ఆక్రమిస్తుంది. ఫలహారముతోపాటు చిన్న వెలుల్లి పాయ (one clove of garlic) తినడం చాలా ప్రయోజనకరంగా ఉంది. ఒక పాయకన్నా ఫలాహారంతోపాటు ఐదు నుంచి పది పాయలు తినడం మంచిదని నా అభిప్రాయం. వెల్లుల్లి రోగకారక క్రిమి సంహారిని అని పరిశోధన చేసిన అనేకులు గ్రంథాలలో వ్రాశారు. ఈ నిజాన్ని మన పూర్వీకులు ఎప్పుడో తెలుసుకున్నారు. వెల్లుల్లిలో ఎలిసిన్ (Allicin) అనే పదార్థమున్నదని అది క్రిముల్ని సంహరించడంలో శ్రేష్టమైనదని 1944వ సంవత్సరములో అమెరికన్ కెమికల్ సొసైటీ (American Chemical Society) వారి పత్రికలో ఒక వ్యాసం ప్రచురించబడింది. ఈ యదార్థాన్ని అనేక ప్రయోగాల్లో

పెన్సిలిన్‌తో పోల్చి చూశారు. అన్ని రకాల క్రిములమీద పెన్సిలిన్ వలెనే పని చేస్తుందని తేలింది. పెన్సిలిన్ కన్నా ఘాటుగాను, మితంగాను పనిచేస్తుందని అన్నారు. వెల్లుల్లిలోని వాసన దానిని ధారాళంగా వాడడానికి ప్రతిబంధకంగా ఉంటుంది. పచ్చి కూరల ఆహారం, అందులోను బంగాళదుంపలను తింటే ప్రారంభదశలో ఉన్న, ముదిరిపోయిన కీళ్ళవాతం, కీళ్ళ నొప్పులకి అద్భుతంగా పని చేస్తుంది. ఇది కాకుండా మూత్రికామ్లముల వల్ల ఏర్పడే, ఇతర వ్యాధులకి కూడా ఈ పచ్చికూరల ఆహారం బాగా పని చేస్తుంది. చర్మ వ్యాధులు, మూత్రకోశంలో ఉండే రాళ్ళు, వెంట్రుకలు రాలిపోవడము, అన్ని రకాల అంటు వ్యాధులు పచ్చి ఆహారము వల్ల నయమవు తాయి. వెల్లుల్లి పెద్ద పేగుల్లో ఉన్న మలాన్ని, కుళ్ళనివ్వదు. బుగ్గలో రెండువైపులా ఒక్కొక్క వెల్లుల్లిపాయ పెట్టుకుంటే పైన ఉన్న భాగాలలో ఉన్న రోగాలను వెళ్ళగొట్టి రోగాన్ని త్వరగా నయం చేస్తుంది. మామూలు జలుబుల్లో వెంటనే ఉపయోగిస్తే అమోఘంగా పనిచేస్తుంది. ముక్కు, గొంతు, చెవి, స్వరపేటికల్లో ఉన్న వాపు, చాలాకాలంగా ఉన్న టాన్సిల్స్, చిగుళ్ళు, చెవిలో ఉన్న వాపులు తొందరగా నయమైపోతాయి. జీర్ణాశయంలోని పుళ్ళు, వాపులు పెద్ద, చిన్న పేగులలోని వాపులు నయమై రక్తశుద్ధి జరుగుతుంది. రక్త మలములు వెల్లుల్లి ద్వారా నయమైపోతాయి. గర్భవతులు పచ్చి ఆహారం తింటూ ఉంటే కులాసాగా ఉంటారు. సులభంగాను, సుఖంగాను, తొందరగాను నొప్పి లేకుండా ప్రసవిస్తారు. సన్నగా, బలంగా ఉన్న శిశువు తల్లికి సాయపడుతుంది. ప్రసవానంతరము ఒక సంవత్సరము పాటు తల్లి పచ్చి ఆహారము తీసుకుంటే బిడ్డకు ఆరోగ్యకరమైన, పుష్టికరమైన పాలు పుష్కలంగా లభ్యమవుతాయి. పూర్తిగా పచ్చి ఆహారము తినేవారికి పొగాకు త్రాగడము, మత్తు పదార్థములు త్రాగడము అసహ్యంగా ఉంటాయి. ఈ దురభ్యాసాలను తేలికగా మానవచ్చును. పచ్చి ఆహారము తినేవారికి సారాయి రుచిగా ఉండదు, పొగ త్రాగుడుకి వెల్లుల్లికి సరిపడదు. పచ్చి ఆహారము తినేవారికి ఉద్రేకములు కలిగించే పదార్థముల అవసరం ఉండదు. కాన్సర్ ఏర్పడ్డది అంటే శరీరము పూర్తిగా శిథిలమయింది అని అర్థం. అది చివరిదశ.

ఈ స్థితిలో పచ్చికూరల ఆహారము బాధను తగ్గించి ప్రాణాన్ని కొంతకాలం వరకు నిలబెట్టడానికి తోడ్పడుతుంది. కాన్సర్ ఏర్పడ్డ వెంటనే చికిత్స ప్రారంభిస్తే చాలాకాలం వరకు జాడ్యము కనపడకుండా చేయకలదు. దీనికి తార్కాణము నేనే. కాని లివర్, గర్భ కోశము మొదలగు ప్రధాన అంగాలలో కాన్సర్ రాకూడదు. కాన్సర్ వచ్చిందని తెలిసిన వెంటనే నూటికి నూరుపాళ్ళు పచ్చి కూరలు తినడం ప్రారంభించడం అతి ముఖ్యం.

ఇక నా రోగాన్ని గురించి కొద్దగా చెపుతాను 1942 నుండి 46 వరకూ సమగ్రమైన పచ్చి ఆహారం తిని చాలా ఆరోగ్యంగా ఉన్నాను. 46 వసంతకాలంలో స్వీడన్ దేశం నుంచి కిస్మిస్, ఖర్జూరము, అలసి, అక్రూర్ మొదలైనని తెప్పించాను. అది నాకు ఉపకారము చేయుటకు బదులు అపకారము చేసినది. వానిని నిలవ చేయుటకు విషద్రావకములు వాడినందుకు, మూడు నాలుగు మాసములు ఉపయోగించినప్పటికీ ఒకనాడు హఠాత్తుగా విపరీతముగా భరించనలవికాని బాధ ప్రారంభమై నయమై మచ్చపడ్డచోట మళ్ళీ చిన్న గడ్డ కనపడింది. తక్షణమే పచ్చిఆహారం ప్రారంభించాను. తక్షణమే గడ్డ మాయమై పోయింది. నా స్నేహితుడైన డాక్టర్ హిండ్ హెడి చెప్పిన సలహాకు విపరీతముగా ట్రయల్ చికిత్స చేయించుకోమని అసలు నా జబ్బుకు వచ్చినది కాన్సర్ కాదని కొందరు స్నేహితులు నన్ను ప్రోత్సహించగా ఆ చికిత్స చేయించుకున్నాను. నయమైన కాన్సర్ మళ్ళీ తిరగబెట్టింది. చంకలో తిరిగి రెండు చిన్న గడ్డలు ఏర్పడినవి. పచ్చి ఆహారం ప్రారంభించిన ఆరు నెలలకి అవి అణగిపోయి సుఖముగా ఉన్నాను. నా శక్తికి మించిన పనులు కూడా చక్కగా నిర్వహించ గలిగాను. 1949లో మామూలు వైద్య వృత్తి మాని హ్యామ్లె గార్డెన్ ప్రక్క స్వంతంగా కొనుక్కున్న ఒకటి, రెండు ఎకరాల పొలంలో ఉదయం నుండి సాయంత్రం వరకు పనిచేసి నాకు కావలసిన పళ్ళూ, కూరలు పండించుకున్నాను. రసాయనిక ఎరువులు మాని కూరగాయల, పళ్ళ తొక్కలు, కంపోస్ట్ ఎరువులు మాత్రమే వాడుతున్నాను. "అమృతాహారము" అని డచ్చి బాషలో ఒక గ్రంథము వ్రాశాను.

అది ఇంకా ఇంగ్లీష్ భాషలోకి తర్జుమా కాలేదు. దానిలో పచ్చికూరలు ఉపయోగించుకునే పద్ధతి, వాటిని తయారు చేసే పద్ధతి, ఇంకా ఇతర విషయములు వివరంగా వ్రాశాను. ఆ దేశపు డాక్టర్లు, ఇక్కడి డాక్టర్లు హ్యూమ్లేయ్ మా గార్డెన్‌కి వచ్చి అక్కడ జరుగుతున్న చికిత్సా విధానాలు నేర్చుకుని అవి వారి దేశాలలో అమలులో పెడుతున్నారు. డాక్టర్లు పచ్చి ఆహారాన్ని గురించి ఇక్కడికంటే ఎక్కువగా తెలుసుకుని, ఆచరణలో పెడితే లోకానికి ఎంతో మేలు చేసినవారౌతారు ఇప్పుడు మా శానిటోరియంలో సంవత్సరానికి వేయిమంది రోగులు చికిత్స పొందుతున్నారు. ఇక్కడ రోగులు, డాక్టర్లు, నౌకర్లు అందరూ పచ్చి ఆహారమే తింటారు. వండిన ఆహారాన్ని తిన్న వెంటనే సరాసరి పచ్చి ఆహారం తినవచ్చును. ఏమీ బాధ లేదు. శరీరబాధలు, ఋతువులని బట్టి, కాలాన్ని బట్టి మారుతుంటాయి. ఈ భోజనమురోజు మూడుసార్లు చేయాలి. పళ్ళు కూరలు కలిపి ఎప్పుడూ తినకూడదు. దంత పటుత్వం ఉన్నవాళ్ళు పచ్చికూరలు చెక్కు తీయకుండా కొరికి, నమిలి తినవచ్చు. దంత పటుత్వం లేనివాళ్ళు చక్కగా తురిమి, తయారు చేసిన వెంటనే తినాలి. తయారు చేసి నిలువ ఉంచకూడదు. నిలువ ఉంచితే వాటి గుణం చెడుతుంది. పచ్చి ఆహారం నీళ్ళు నీళ్ళు అయ్యే లోపల నమిలి మ్రింగాలి. మొలకెత్తిన జొన్న, సజ్జ, మొక్కజొన్న వగైరా ధాన్యాలన్నీ పండ్లతో కలిపి తినవచ్చును. మేమంతా మా శానిటోరియంలో గుమ్మపాలు మూడు పూటలా త్రాగుతాము. వెల్లుల్లి ఔషధం కనుక సలాడ్‌లో ఉల్లిపాయ ముక్కలు తింటాము. బాదాము, అక్రూర్, వేరుశనగ మొదలైన పప్పులు వాడుతాము. పచ్చి కూరలు, ఆకు కూరలు, బంగాళదుంపలు, బీట్రూట్, క్యారట్‌లాంటివి వాడవచ్చును. ఇవన్నీ చక్కగా తురిమి వాటిలో తేనె కలుపుకొని తినాలి. జీర్ణ కోశంలో పుండు ఉన్నవాళ్ళు ప్రారంభదశలోనే ఈ ఆహారాన్ని మొదలు పెట్టాలి. పచ్చి ఆహారం తింటూ దురలవాట్లు లేకుండా ఉంటే లోపములు, రోగాలేమీ ఉండవు. అసహ్యకరమైన లావు ప్రమాదకరము. అటువంటిది కూడా ఈపచ్చి ఆహారంవల్ల పోతుంది. ఈ పద్ధతివల్ల గృహిణులకు సగం పని తగ్గి ఎక్కువ విశ్రాంతి చిక్కుతుంది. భర్తకు, పిల్లలకు సేవ చేయడానికి అవకాశము

హెచ్చి ఆనందం కలుగుతుంది. ఈ ఆహారము వల్ల పలుచని నాజూకైన శరీరము, వంగని నడుము, వయ్యారమైన నడక, తుమ్మెద రెక్కల్లాంటి నల్లని కేశములు, తళతళలాడే శరీరం ఏర్పడి జీవితం సుఖ-సౌఖ్యాలతో నిండిపోతుంది. శరీరము ఆరోగ్యంగా ఉంటే మనస్సు నిర్మలంగా ప్రశాంతంగా ఉంటుంది.దురాలోచనలు, సదాలోచనలుగా మారుతాయి. ప్రపంచం ఎదురుచూస్తున్న దివ్య సంస్కృతి వృద్ధి చెందుతుంది. మానవ జీవితాలు మారి భూలోకం స్వర్గధామంగా మారుతుంది. ఇదే కాన్సర్ వ్యాధికి ఉత్తమమైన మార్గము.

# సిద్ధమంగళ స్తోత్రం

1. శ్రీమదనంత శ్రీవిభూషిత అప్పలలక్ష్మీనరసింహరాజా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

2. శ్రీవిద్యాధరి రాధ సురేఖా శ్రీరాఖీధర శ్రీపాదా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

3. మాతాసుమతీ వాత్సల్యామృత పరిపోషిత జయ శ్రీపాదా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

4. సత్యఋషీశ్వర దుహితానందన బాపనార్యనుత శ్రీచరణా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

5. సవితృకాఠకచయన పుణ్యఫల భరద్వాజ ఋషి గోత్ర సంభవా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

6. దో చౌపాతీ దేవ్ లక్ష్మీఘన సంఖ్యాబోధిత శ్రీచరణా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

7. పుణ్యరూపిణీ రాజమాంబసుత గర్భపుణ్యఫల సంజాతా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

8. సుమతీనందన నరహరినందన దత్తదేవ ప్రభు శ్రీపాదా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

9. పీఠికాపుర నిత్యవిహారా మధుమతి దత్తా మంగళరూపా ।
జయవిజయీభవ దిగ్విజయీభవ శ్రీమదఖండ శ్రీవిజయీభవ ॥

## శ్రీదత్త జయలాభ యశాధికర స్తోత్రం

1. దత్తాత్రేయం మహాత్మానం వరదం భక్తవత్సలం ।
ప్రపన్నార్తిహరంవందే స్మర్తృగామీ సనోవతు ॥

2. దీనబంధుం కృపాసింధుం సర్వకారణ కారణం ।
సర్వరక్షాకరం వందే స్మర్తృగామీ సనోవతు ॥

3. శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణమ్ ।
నారాయణ విభుం వందే స్మర్తృగామీసనోవతు ॥

4. సర్వానర్ధ హరం దేవం సర్వమంగళ మంగళం ।
సర్వక్లేశ హరం వందే స్మర్తృగామీ సనోవతు ॥

5. బ్రహ్మణ్యం ధర్మతత్వజ్ఞం భక్తకీర్తి వివర్ధనం ।
భక్తాభీష్టప్రదం వందే స్మర్తృగామీ సనోవతు ॥

6. శోషణం పాప పంకస్య దీపనం జ్ఞానతేజసః ।
తాపప్రశమనం వందే స్మర్తృగామీ సనోవతు ॥

7. జన్మసంసార బంధఘ్నం స్వరూపానంద దాయకం ।
నిశ్శ్రేయసపదం వందే స్మర్తృగామీసనోవతు ॥

8. సర్వరోగ ప్రశమనం సర్వపీడా నివారణం ।
ఆపదుద్ధరణం వందే స్మర్తృగామీ సనోవతు ॥

9. జయలాభయశః కామ దాతుర్దత్తస్య యస్తవం ।
భోగమోక్ష ప్రదస్యేదం ప్రకటేత్సుకృతీ భవేత్ ॥